# శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి

# " గురువాణి "



" ఉత్తమోత్తమమ్ములు ఉచ్ఛ్వాస నిశ్వాస
పంక్తులరసి తాను బ్రహ్మమగుట ...
ముసుగులోన శివుడు పొసగియున్నాడయా !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "




పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ మూవ్‌మెంట్
ఇండియా

www.pssmovement.org

# శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి గురువాణి

" గురులు శిష్యులెల్ల, పరిపాలనాపరుల్,
పారమార్థికులుగ ప్రబలిరేని
సంఘమందు సుఖము శాంతి వర్ధిల్లును !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" భక్తులైనవారు పరిపక్వబుద్ధిచే
ధ్యానమందు నాత్మ నందగలరు !
ఆత్మనంద శాశ్వతానంద సుఖమబ్బు !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" రూఢమైన స్వస్వరూపావధారణే
చీడ పీడ లలము చిత్తమందు
మరులు కొన్న ఎండమావులు చల్లార్చు !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" పుస్తకములు చదువ పూర్ణత్వమబ్బదు -
హృదయసంపుటముల చదువవలయు !
పారిశుద్ధ్యమొకటె పరమాత్మ చేర్చును
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" పుణ్యలోకములకు బోయిన పోకగా
పోవువారు వచ్చిపోవుచుంద్రు ;
వచ్చిపోవుదారి వదిలించుకొనవలె !
కాళికాంబ ! హంస! కాళికాంబ ! "

# శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి గురువాణి

" రూపరహితునకును రూపమ్ము గల్పించి
కర్మకాండ పెంచి కలుషమతులు
ధర్మమార్గములను ధ్వంసమ్ము చేసిరి !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" తీర్థయాత్రలందు దేవుడొక్కడె గదా !
మంచి తీర్థము మన పంచనుండె !
దివ్యతీర్థమిదిగో దేహమందున్నది !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" కాయమనెడి ' విల్లు ' కదలకుండగ బట్టి
బుద్ధియనెడి ' నారి ' పొరలకుండ
మనసనేటి ' యంబు ' మరి గురి చేయరా !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" కాళికాంబ యనుట లీలావినోదంబు
కాదు కాదు హంస కాళికాంబ
కాళికాంబ హంస ... ఆత్మ కాళిక సుమా !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" దృష్టి నిలిపెనేని దేవుడు దిగివచ్చు !
దృష్టి నిలుపడేని నష్టపడును !
దృష్టిలోన సర్వసృష్టి పుష్టమౌను !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

# శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి గురువాణి

" కంద కుండలించి కుండలి నాడించి
జమిలిమోత నాగసరము నూద
నాగుపాము లేచి నాట్యమ్ము చేయును !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" పాము పెట్టె నున్న పరిమళంబె లేదు,
తెరచిచూడ పెట్టె పరిమళించు ;
పరిమళించుటనగా పడగెత్తుటే గదా !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" ఆరు కమలములకు నావలి బయలులో
బ్రహ్మరంధ్రమనెడి బాట కలదు ;
బాట వెంట నడువ పరమపదమ్మేగు !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" గురుముఖాన విన్న కుండలినీశక్తి
మేలుకొలిపి యారు మెట్టు లెక్క
దూరదృష్టితోడు దూరశ్రవణమబ్బు !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" గాలి రీతి విశ్వగోళాలలో నుందువు !
దివుల భువుల మధ్య తిరుగగలవు !
నీవు లేని చోటు నిక్కముగా లేదు !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

# శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి గురువాణి

" చిత్తవిభ్రమమున జీవేశ్వరులు వేరు
వేరటంచు దలచు వెర్రివాడు ...
కలిసియుండు గాదె ఘటమఠాకాశముల్ !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" దివ్యమంగళమ్ము దేవతాబింబమ్ము -
ఉల్లమందు నున్న ఉపము గనక
యాత్రలెల్ల దిరిగి యాతన పడనేల ?
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" వద్ద నున్న గురుని వైపు గానగలేక
వెర్రిమొద్దుల వలె వెదకులాడి
బుద్ధిమాలి నరుల పోయిరి పోకగా !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" వెదకి వెదకి వెదకి ... వేసారి వేసారి
అచట నిచట లేడటనుచు నెంచి
తరచి చూచి తాను తనలోన గనుగొనె !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" సూత్రమెరిగి వెలుగు చూడగ చూడగ
పాపజాలమెల్ల రూపుమాయు !
పూర్వజన్మ కర్మ బూడిదైపోవు !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

# శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి గురువాణి

" చదువగలరు ... లోని సారమ్మెరుంగరు !
చదువుల ఫల మదేమి ? సారమేమి ?
సారమైన చదువు సాధించ తరియించు !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" స్నానమందు లేదు ! పానమందును లేదు
మంత్ర తంత్రములందు మహిమ లేదు !
గుణము కుదిరెనేని ఘనయోగి తానౌను !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" ఇలకు దిగెడి వేళ కుల మెవరికి లేదు !
మొదలు శూద్రుడుగను పుట్టువందు ...
శ్రుతులు చదువు వెనక శూద్రుండె విప్రుడౌ !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" మాటకేమి ఫలము ? మనస్సు నిల్ప ఫలమ్ము !
మనసు నిలుప తేట మాట దొరకు !
తేట మాట దొరక దేవతామూర్తియౌ !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" కులమనేటి తెగులు కొంపలు గూల్చును !
చలమనేటి తెగులు చావుదెచ్చు !
కులము, చలము చంపు గురుడైన విప్రుండు !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

# శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి గురువాణి

" ఆశలున్న వారికది యేది అంటదు ;
ఆశలుడుగ గలుగు ఆత్మశుద్ధి ;
ఆత్మశుద్ధి గలుగ నందును పరమాత్మ !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" చదువుకొన్న ఫలము కుదురైన వినయమ్ము !
వినయఫలము వేదవేది యగుట !
వేదవేది ఫలము విశ్వమ్ము తానౌట !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" కోతిపిల్ల రీతి గురువుతో నుండిన ,
శిష్యులకు సుంత చేటు రాదు !
నమ్మి నమ్మకున్న దుమ్ము పాలగుదురు !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" సర్వమతములందు సారమ్ము గ్రహియించి ,
ఐకమత్య మార్గ మనుసరించి ,
క్రించుదనము మాని ప్రేమించుకొన మేలు !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" జనన మరణ దుఃఖ సాగరమ్మున నుండి
పరమ పదము చేర్చు గురువరుండు
నిత్యసత్యమైన ప్రత్యక్ష దైవమ్ము !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

# శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి గురువాణి

" భుజము గాల్చుకొన్న ... భుజముపై జందెపు
ప్రోగువేసికొన్న ... ముక్తి రాదు !
నేను మేను లోన నేనెరింగిన ముక్తి !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" ధర్మరహితులెల్ల తాత్కాలికమ్ముగా
భోగభాగ్యములను పొందవచ్చు ...
ఆత్మలోని బాధలంతలింతలు గావు !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" సాటి మానవునకు సాయమ్ము పడబోక
నల్లరాళ్ళు తెచ్చి గుళ్ళుకట్టి
మ్రొక్కులిడిన బ్రతుకు చక్కపడంబోదు !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" ఆటవికుల కెల్ల ఆధ్యాత్మ తత్వమ్ము
బోధ చేసి పూర్ణ పురుషులుగను
తీర్చిదిద్దువారె దేవతామూర్తులు !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" చాలగలదు హింస సంసారమందును -
పసిడియందు హింస ప్రబలి యుండు -
హింస చేతునన్న నిక ముక్తి లేదయా !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

# శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి గురువాణి

" పరశరీరములను స్వశరీరమట్లుగా
తలచువాడు హింస సలుపబోడు !
హింస సలుపనట్టి ఇంగితజ్ఞుడె బ్రహ్మ !
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

" జీవులను వధించి జీవికి వేసెనా
జీవ దోషములను జిక్కువడును ;
జీవహింస చేత చిక్కునా మోక్షంబు ?
కాళికాంబ ! హంస ! కాళికాంబ ! "

## ధ్యానం చేసే పద్ధతి = ఆనాపానసతి

### " శ్వాస ధార ... మీద ... ధ్యాస ధార "

సుఖాసనంలో ... హాయిగా ... కూర్చుని ... చేతులు రెండూ కలిపి ... కళ్ళు రెండూ మూసుకుని ... ప్రకృతి సహజంగా జరుగుతూన్న ఉచ్ఛ్వాస, నిశ్వాసలను ... ఏకధారగా ... గమనిస్తూ వుండాలి ! మామూలుగా జరుగుతున్న ఉచ్ఛ్వాస, నిశ్వాసలనే ఆహ్లాదంగా గమనిస్తూ వుండాలి.

### " ధ్యానం నిర్విషయం మనః "

మధ్య మధ్యలో అనేకానేక ఆలోచనలు వస్తున్నా వాటిని ఎప్పటికప్పుడు కట్ చేస్తూ ... మళ్ళీ మళ్ళీ శ్వాస మీదకే ... ధ్యాస మరల్చుతూ ఉంటే ... క్రమక్రమంగా ... ఆలోచనా రహిత స్థితి కలుగుతుంది ... మనస్సు నిర్విషయం, శూన్యం అయిపోతుంది ... ఇదే ధ్యాన స్థితి.

# పిరమిడ్ ధ్యానుల తత్త్వ సారం













ధ్యానం .. అంటే .. శ్వాస ధార .. మీద .. ధ్యాస ధార